# రెడ్ల చరిత్రము

(పద్యకావ్యము)

గ్రంథకర్త:

'విమర్శకాగ్రేసర'

**కొత్త భావయ్య చౌదరి,**

కమ్మవారిచరిత్ర, దేవరహస్యాలు, కల్పవల్లి,

సంగభూపాలీయము, వ్యామోహము,

సగరపట్టాభిషేక నాటకాది రచయిత.

సంగంజాగర్లమూడి,

(గుంటూరు జిల్లా).

మొదటి కూర్పు 1000 ప్రతులు.

కాపీరైట్ ] డిశంబరు, 1953 [ వెల 0-8-0

# పీఠిక

ఆంధ్రదేశమును ప్రాచీనకాలమునుండి యనేక రాజవంశములవారు పాలించుచు వచ్చిరి. అందు 1326 మొదలు 1440 A. D. ప్రాంతమువరకు జరగిన రెడ్డిరాజుల పాలనమత్యంత ప్రతిభావంతమైనవానిలో నొకటి యనుటకు సంశయముండదు. వీరు దేవబ్రాహ్మణుల కగ్రహారాదుల నిచ్చి పోషించిరి, వ్యాపారము వృద్ధి జేసిరి. భాషాపోషకులై యనేక గ్రంథముల వ్రాయించిరి. కళల నన్నివిధముల నభివృద్ధికి దెచ్చిరి. కాని, వీరి కాలములో యుద్ధము లనివార్యములై దేశము బాగుగా వర్ధిల్లలేదు. వీరు అద్దంకి, కొండవీడు, రాజమహేంద్రపురి రాజధానులుగా నేలిరి. వీరి చరిత్రను పద్యకావ్యముగ నాంధ్రేతిహాస పరిశోధక మండలివారి రెడ్డిసంచికలో ముందుగా ప్రకటించితిని. చారిత్రకవిషయము లెంత హెచ్చుగా బ్రచారమొనర్చిన నంతగా దేశాభ్యుదయమునకు తోడ్పడునని దలంచుచు, దీనిని మండలివారి సౌజన్యమువల్ల పునర్ముద్రణ గావించుచు, వారికి కృతజ్ఞుండ నగుచున్నాను. దీనిలో చివరగల నక్షత్రమాలికా సీసములు రెండును నూతనముగ జేర్పంబడినవి. రెడ్డిరాజుల చరిత్ర మాంధ్రలోకమున విరివిగ వ్యాప్తమగు గాక ! యని కోరెదను.

ఇట్లు,

గ్రంథకర్త

# విషయ సూచిక

౫

సూతసంహితఁ గూర్చిన - శ్రీతపోను
నాథుఁ డధ్యాత్మ రామాయ - ణము రచించె
ఘనుఁడు కాణాద పెద్దన - కవివరుండు
రవి శశుల వంశ్యులని రందు - రడ్డివరుల.

౬

సూర్యవంశజుఁ డగు భీమ - చోడు పుత్రి
వేమ యల్లాడరెడ్డినిఁ - బెండ్లియాడె
చంద్రవంశ హరిహరు పుత్రి - చారుగాత్రి
కాటరెడ్డిని జేపట్టె - గాదె యిట్టు
లెన్నొ ధృవపరచెడి రెడ్ల - యినకులంబు.

౭

హరిహరుని మనుమరాలగు హరిహరాంబ
కాటరెడ్డికి బుట్టిన కన్నె మిన్న
దనరె యల్లాడభూపతి తనయుఁడైన
వేమభూపాలు భర్తగా స్వీకరించి.

౮

అనవేమ రెడ్డిభూపతి
దనయయుఁ బెండ్లాడె చోడధాత్రిపు భక్తి
కుని సుతుఁని భీమచోడుని
యినకుల సంజాతు - నిట్టి వెన్ని గలిగెనో ?.

౯

ఆయిన శ్రీనాథ సుకవీంద్రుఁ - డలఘుకావ్య
ములను హరిపాదజాబగాగ - నుచ్చటించె
మతవిభేదము లందిన - మహితశీలమ్ముఁ
దుదకు నాగ్లవదంచును విదితపఱచె
తెలుఁగదేశపు పూర్వాపర - చరిత విదుఁడు.

౧౦
దేశకాలానుగుణ్యులై తేటపల్లి
తుదకు శాఖోపశాఖలై చెదరి రెడ్లు
పంట రేనాటి మోటాటి పాకనాటి
మొరసయోధ్యాది నామములై పరలి రిలను.

## —. చరిత్రారంభము. —

౧
పదునాల్గు శతాబ్దంబున
సదమల రత్నఖని యాంధ్రభూస్థలమెల్లన్
విదితయశో విభవుండయి
ముదమున వీరప్రతాప భూపుండేలెన్.

౨
మహమ్మద తుఘ్లక్కుపాదుషా ముష్కరముగ
నమ్మహారాజు సీమల నాక్రమింప
నెంచి తండోపతండాలు ముంచిపడఁగ
పోరు లతిభీకరంబుగ బుడమిఁ గలిగె.

౩
ఆ భయంకర రణముల నాంధ్రవీరు
లెంతగా శౌర్యముం జూపి యేపుగొన్న
తుదకు నేకశిలాపురి దురకప్రభుల
కైవశంబయ్యె నేమందు గాలమహిమ.

౪
ప్రాపయి హిందువు లెల్లరు
కాపయ నాయకునిగూర్చి కలుషతురకలన్
రూపాడి యోరుగల్లున
స్థాపించిరి రాజధాని చతురత మెరయన్.

— [illegible] ప్రశస్తి

## దేసటి వేమారెడ్డి

సీ. తనరాజధాని నద్దంకిగా నొనరించి
ప్రబలిన దేశ నే పుణ్యమూర్తి
శ్రీశైల సామీప్య కృష్ణాస్రవంతికి
చిత్రసోపానముల్ చెలఁగఁజేసె
నల్లమలారణ్య మార్గంబులన్ గూడ
నిర్మించె నెవ్వాఁడు ధార్మికుఁడయి
అమరేశ్వరస్వామి కతిభక్తి నర్పించె
బంగరు కలశముల్ రంగుమీర
హరివంశ రామాయణాది కావ్యంబులు
కృతినొంది శాశ్వతకీర్తిఁ బడసె

గీ. అగ్రహారంబులుగ జేసి యాతుకూరు
ప్రీతి మంచాల, వలివేరు, పెరవలియును
బ్రాహ్మణోత్తములకొసంగె భక్తిమీర
బ్రాతవల్లిల్లు లన్నింటి వరుస నిల్పె
దురిత రాజుల హరియింపఁ దోఁపనారి.

2

శా. ఆ నామాత్యుఁడు మల్లినాథుఁడును మంత్రాంగంబులంగా పెట్టై
భూమండలంగడు నేర్పుమై నడుపఁగాఁ బాల్పారె రాజ్యంబు నం
దేమేమో ఘన దానధర్మవ్రతముల్ హేమాద్రి ఖండంబునం
దామోదించిన రీతి సల్పెనితఁ డా యారీతుఁ డా భక్తిచే.

3

వినదు నాస్థానకవి శంభుదాసుఁ జేసి
యాంధ్రభాష నెక్కుడు శ్రద్ధ నాదరించి

ఆ

అచటి పేటి చమూపతు లల్లనల్ల
నన్నిజాభ్యుదయంబున కాసపడిరి
రాచకొండకు వెల్మవీరవరు లరిగి
తమను రాజ్యాభివృద్ధికై శ్రమల బడిరి.

తే

అట్లె దేసటి పోలయ యను విభుండు
పంటరెడ్డికులేంద్రుఁడు ప్రాభవముగ
నొక్క సైన్యాధిపతిగాగ నొప్పియుంట
నతని సుతుఁడగు వేమయ యతిశయమున
సైన్యముల ద్రిప్పి దాటి కృష్ణాస్రవంతి
పూంగినా డాక్రమించె నా పుణ్యమేమొ.

తే

అట్టి హిందూసురత్రాణు ననుసరించి
ధరణికోటను బాలింప తమ్ము మల్లి
ధాత్రిపుని నియమించి యుద్దామశక్తి
రాజ్యమును విస్తరించె నరాతిచయము
భయము దక్క బ్రతాపంబు బైటఁబడగ.

—:o:—

కొండవీటి ప్రభువులు

## దేసటి వేమారెడ్డి

సీ. తనరాజధాని నద్దంకిగా నొనరించి
పూంగినా దేర నే పుణ్యమూర్తి
శ్రీశైల సామీప్య కృష్ణాస్రవంతికి
జిత్రసోపానముల్ జెలగజేసె
నట్టులహోబిలు నాలయంబున గూడ
నిర్మించె నెవ్వాడు ధార్మికుండయి
అమరేశ్వరస్వామి కతిభక్తి నర్పించె
బంగరు కలశముల్ రంగుమీర
హరివంశ రామాయణాది కావ్యంబుల
గృతినొంది శాశ్వతకీర్తిం బడసె
గీ. నగ్రహారంబులుగ జేసి యాతుకూరు
ప్రీతి మంచాల, వలివేరు, పెరవలియును
బ్రాహ్మణోత్తములకొసంగె భక్తిమీర
బ్రాతనల్లిల్ల అన్నింటి వరుస నిల్పె
దురక రాజుల హరియింపం దోలివారి.

౨

శా. రామామాత్యుడు మల్లినాథుడును మంత్రాంగంబులన్ మేటులై
భూమీశుంగడు నేర్పుమై నడుపంగాం బొల్పారె రాజ్యంబు నం
దేమేమో ఘన దానధర్మవ్రతముల్ హేమాద్రి ఖండంబునం
దామోదించిన రీతి సల్పెనితం డా యారీతుంగా భక్తిచే.

3

తనదు నాస్థానకవి శంభుదాసుం జేసి
యాంధ్రభాష నెక్కుడు శ్రద్ధ నాదరించి

శాస్త్రవిదులను బోషించి శత్రుకోటి
బారద్రోలె దేవటి వేమపార్థివుండు
ప్రోలిరెడ్డి సుతుండు నా పూంగినాట.

౪

అడిగినట్టి వారి కమిత భూదానమ్ము
లొసంగుచుండి సీమ నిద్ధకీర్తి
వరలి దాల్చె నతడ పరిమిత భూదాన
పరశురామ బిరుదు ప్రాభవమున,

౫

చెరువులను బావులెన్నొ నచ్చెరువుగాఁగ
సీమలో నిర్మితముజేసి సీమ మెచ్చ
నచ్చటచ్చట జలివేంద్ర లాదినిల్పి
ప్రజల సౌఖ్యాభివృద్ధికై పాటుపడియె.

౬

అనుజులగు మల్లరెడ్డియు నన్నరెడ్డి
కొమరుఁ డనపోతరెడ్డియు గూర్చు బావ
మఱఁది నాకయరెడ్డి లో బలుప నరుల
వేమభూపాలు పాలన విస్తరిల్లె.

౭

అనపోతనాయుఁ డాతని
యనుజుఁడు మాధవునిగూడి యని దారసిలఁగా
ఘనముగను ధరణికోటం
జెనకుచు బారంగద్రోలె సింహసదృశుడై.

౮

కటక భూపాలుఁడై నట్టి గజపతీంద్రు
డిట్టు లొకమారు దండెత్తి యితని రాజ్య

ముపహరింపఁ దలంపఁగా నమిత శౌర్య
సాహసంబున నోడించి సాగనంపె.

౯

పరమపూజ్యాంధ్రలోక తపః ఫలంబు
సీమ నివసించు విబుధాళి నోముపంట
కాపు జనసంఘమునకును గల్పతరువు
నాగనీ పంటకుల మహీ నాథుఁడొప్పె.

౧౦

పంచవింశతి వత్సరాల్ ప్రాభవమున
జగద భీష్టంబుగా భువి సాకి యతఁడు
స్వర్గధామంబు జేరఁగ విశ్రాంతిఁ గోరి
రాజ్యలక్ష్మి వరించె నా రాజసుతుని
పూజ్య పతియంచు నా యనపోత నృపతి.

—:0:—

## అనపోతారెడ్డి

సీ॥ మణికేశ్వరమున నుమాపతికి నొసంగె
నారామభూము లత్యంతభక్తి
శ్రీగిరిలింగంబు శ్రీమల్లినాథలిం
గంబుగ నిర్మించి ఖ్యాతిఁగాంచె
ముకుళపురిజా క్షీణముగనున్న పరదేశ
వ్యాపారసుంకముల్ వదలివైచె
రణమునకై వచ్చు ననపోత మాదయ
లను వెల్మవీరుల వెనుక కంపె
దనరాజధాని వద్దంకిని దొలఁగించి
కొండవీడున నెలకొల్పినాడు

గీ॥ కాటరెడ్డియు నల్లమాకయ్యరెడ్డి
భావుకులు దమ్ముఁ దనవేమపార్థివుండు
రాజ్యమును విస్తరింప దర్పంబుబూని
పుడమి పాలించె నాయనపోతనృపతి,

౨

ఒక్క సూర్యోపరాగాన నుత్సుకతను
పోతభూపతి కోడూరు పురవరంబు
బ్రాహ్మణులకు నల్లిల్లాగాఁ బంచి యొసఁగె
వివిధ దేశాల తనకీర్తి విస్తరింప,

౩

ద్వాదశ షష్ఠాబ్దము లీ
మేదిని పాలన మొనర్చి మేటి నృపాలుం
డాదర్శ భూవరుండని
మోదంబున జనులు పొగడఁ బుణ్యుఁడొప్పెన్.

౪

అనపోత రెడ్డివర్యుఁడు
చనినన్ స్వర్లోకమునకు శాశ్వతముగ నా
యన జన్మములో నొకఁడగు
ననవేమ నృపాలుఁ డంత నధిపతియయ్యెన్.

—(౦)—

# అ న వే మా రె డ్డి

సీ. హేమాద్రి దానచింతామణి రీతుల వ్రత - దానధర్మముల్ వరుస నిలిపె
దనతంత్రిసోవరుల్ దారిజూపఁగ బ్రాహ్మణా-గ్రహారమ్ముల నచ్చటచట
మన్యమూ పృనము నిమ్మడిలంక, కొల్లూరు- పెదచెరకూరులఁ బ్రీతినిచ్చె
మామిడి పెద్ద నామాత్యుండు మంత్రిగా-జేరి సేయఁగ యశశ్శ్రీలఁగాంచె
రాజమహేంద్రపురంబునునిరవద్యకొల్వ-పుర్యాదిదుర్గముల్ పోరఁగూల్చె

గీ. సింహపురిదాక రాజ్యంబు-జేర్చి యేల
వెలమనృపతుల దేశంబు - వీకఁజొచ్చె
వాడపలి ప్రాంతమున దన - ప్రతిభఁజూపి
విమల సత్కీర్తి వరుఁడన-వేమ నృపతి.

౨

వేనవేలు సువర్ణముల్ - విరివిగాఁగ
సంస్కృత కవీంద్రులకు వెద-జల్లినాఁడు
ప్రాక్సముద్రాధి పతియయి - వణిజవరుల
దేశవాణిజ్య సంపదఁ - దీర్చిదిద్దె
ధీమహితుఁడగు నా యన-వేమ విభుఁడు.

3

మల్లి గూరమ్మ దేవతకు - మోదమలర
నిలిపి వడిదర గ్రామంబు - పలకలూరు
మల్లగూరు నొసంగె నా-భోగములకు
దేవతాభక్తిమై జగ-ద్ధితముగాఁగ

౪

సరస సంగీత సాహిత్య - చతురరచన
వివిధకళలాది బేర్గొన్న - వేశ్యలకును.
భూరిదేవాలయములకు - పొలుపు మీర

సర్వ మాన్యంబులిచ్చి య-శంబు గాంచె
వివిధసీమల నా యనవేమ నృపతి.

౫

అష్టా దశ వత్సరములు
విష్టపమున నేలుచుం ద్రి - విష్టపతుల్యా
గష్టసుఖంబులఁ గాంచెను
శిష్టజనోద్ధరణ సల్పి - చిరకీర్తనుఁడై.

౬

మచ్చరము రాజ్యకాంక్షయు - బెచ్చుపెరిగి
వెలమరెడ్డి నృపాలుర-చలము హెచ్చె
నంతటవరము లెన్నియో - యాంధ్రభూమి
గల్గె జయ మెవ్వరికి గాని - గానబడక.

౭

పినవేదగిరి నృపాలుని
వనిలోఁ దెగటార్చిపేర్చి - యనవేముండుగా.
ఘనసింహతలాట బిరుదు
గొనియెం దనవైరివరుల - గుండెలవియఁగా.

౮

ఇట్టి రణరంగముల మధ్య-నేపుమీరి
వెలమనృపతులతో బోరి - భీకరముగ
గడకు సింగయ యనపోత-కాంతువలన
వాజిలో వీరస్వర్గంబు-నందె నితఁడు,

౯

అమ్మహీనాథు - డిటు లస్తమించినంత
కొమరగిరి యనపోతని-గూర్మిసుతుఁడు

రాజ్యభారంబుబూనె న - రాతులెల్ల
నతనితో మైత్రిసల్పిరి - చతురుఁడగుచు.

—:o:—

## కుమారగిరి రెడ్డి

సంస్కృతభాషా విశారదత వసంత-రాజీయ నాట్యశాస్త్రము రచించె
వింతగానలిపి వసంతోత్సవముల - వసంతరాజనుపేరు జగతిగాంచె
కొమరుఁడం[illegible]గూర్చుండ ఘనతులా-పురుషదానంబుల బూన్చిసలిపె
ఆవచితిప్పయశెట్టి యాభిజద్వీపంబుల-వస్తువుల్ దేగ వైభవతగొనియె.

గీ. నాల్గుచెఱఁగుల రాజ్యాధి-నాథులెల్ల
దనకు హితులుగనుండఁగా - ధరణినేలె
వినయ విద్యా వివేక - సంజనిత కవిత
మారగిరిరెడ్డి భూపతి - మహితయశుఁడు.

౨

ఆపదోద్ధారకుండు నా-నధికదాన
ధర్మగుణశాలిగా నొప్ప - తండ్రిబోలి
భోగదేవేంద్రుఁడని ప్రజల్ - బొగడుచుండ
కొమరగిరి పదునేడేండ్లు-సమత నేలె.

౩

చీనిచీనాంబరాల్ గంధ-సింధురమ్ము
పరిమళించెడి కర్పూర-పాదపములు
ఘుమఘుమాయించుచుండ సం-కుమదద్రవము
ఆణిముత్యాల సరులను-హారులు కరులు
దేశదేశాలఁ దెప్పించి-తేజరిల్లె.

౪

వీమమొప్పగ గాటయ-వేమ నృపతి
విపులరాజ్యంబు రక్షించు - వీరవటుడు
తోడునీడయియుండ నే-కీడులేక
శాంతియుతమగు పాలన - సలిపె నితఁడు.

౫

తనదు ప్రతినిధిగాఁజేసి-దనయునుంగు
సుతుని వీరాన్న పోతభూ-పతిని రాజమ
హేంద్రపురి నిల్పి రాజ్యంబు-నేలినాడు
దర్పమున గొండవీట నీ-ధాత్రిపుండు,

౬

వీరాన్న పోతవర్మ కు
మారుఁడు దనముందె- యెల్లొ మరణింపంగా
ఆ రాజమంద్రి రాజ్యము
నేరుపుమై కాటవేమ-నృపతి కొసంగెఁగా.

౭

పెంచి పెద్దజేసి - వృద్ధికిదెచ్చిన
పుత్రమరణమునకుఁ - బొగిలిపొగిలి
కొమరగిరియు దనదు - కొండవీట్రాజ్యంబు
వారసులకు వదలి - పరము జెందె.

౮

వంశముఖ్యుఁడు పెదవేమ - పార్థివుండు
కొండవీడాక్రమింపఁగా - గోరెవంత
కాటవేముఁ దెదిర్చి నం - గరములెన్నొ
నల్పినను రాజ్యలక్ష్మి వ - శంబుగాక
జేరె పెదవేమ పార్థివ - శేఖరునకు.

# పెదకోమటి వేమారెడ్డి

సీ॥ బాహుబలముచేనర్జించి పాలించెఁ-గొండవీడ్పురము నాఖండలువలె
వీరనారాయణ బిరుదాంకుడయ్యె దే-వరకొండ వెల్మలఁ బారఁద్రోలి
యమరుకావ్యమునకు వ్యాఖ్యతానెరచించి-సర్వజ్ఞబిరుదంబునరవిగొనియె
విద్వాంసులందరి ప్రీతిగాగనుచుండి - సంస్కృతభాష యశంబునిల్పె

గీ. పండితుండగువామన - భట్టుచేత
సంస్కృతంబున వ్రాయించె - చరితమెల్ల
వేదగిరిరాజు ననిలోన - వెదకిచెండె
వీరుఁడా పెదకోమటి - వేమనృపతి.

౨

శ్రీనాథకవిని విద్యా
స్థానాధిపుఁజేసి సర్వ-సంస్థానములన్
మానిత యశోధనమ్ముల
బూనిక నార్జింపఁబంపె - బుధపూజితుఁడై.

3

గృహరాజసౌధమున బ్రి
త్యహమును వసియించె శిల్ప-తత్వజ్ఞుఁదనన్
ఇహమునసే రాజ్యంబున
"నహి" యానిర్మాణమని జ-నంబులు మెచ్చన్,

౪

పొన్నపలి తనుపూరులు - భూసురులకు
నగ్రహారంబులుగజేసి-ఖ్యాతినందె
మునికలూరును బండారు-పలియు మల్ల
గూరమాదేవతకు నిడి - పేరుగాంచె.

పింగ్నమాత్యుఁడను మంత్రి-శేఖరుండు
ప్రజ్ఞమై రాజ్య తంత్రంబు - బలుక మెచ్చి
ఛత్రచామ రాందోళికా-చయము విచ్చి
యగ్రహారంబులనొసంగి - ఖ్యాతిగాంచె.

౬

గన్నభూపాలు సత్పుత్రి-కామకల్లి
సూరమాంబను బెండ్లియై - సుతులఁగాంచె
నామె సంతాన సాగరం-బనెడి చెర్వు
విశ్రుతముజేసి పేరొందె - ధర్మబుద్ధి.

౭

శరనగాండీవి జగనొబ్బ - గండదాది
బిరుదము లనేకముల్ దాల్చి - వెలమ విభుల
దండయాత్రల నన్నింటి - దరిమికొట్టి
నిలిపె నీరెడ్డి రాజ్యము - నిపుణుఁడగుచు.

౮

ఫిరోజిషాయను గుల్బర్గ- ధరణి విభుఁడు
దనకు నెచ్చెలియై సాయ-మొనరఁజేయ
వీరవరుఁడయి కాటయ-వేముతోడ
రాచకొండాది ప్రభులతో-రణము లెన్నొ
సల్పె జయలక్ష్మి యెవ్వరి - సరకు గొనదు.

౯

వేదగిరిరాజు జంపిన - విధమెఱింగి
వీకమై లింగయానపోత - విభులురేగి
ఘోర రణముల సల్పి దుర్వా-రముగను
దుదకు పెద వేమ భూపాలు - ద్రుంచిరందు
రాచవేమ సుతుండంత - రాజ్యమందె,

గుడియు బ్రాకార మొక్కటి - గోపురాలు
ముల్లగూరమ్మ దేవత - మోదమంద
విశ్వమోహనముగఁ గట్టె - వేమ విభుఁడు
ముల్లగూరునఁ బ్రజలెల్ల - నుల్లసిల్ల.

—:O:—

## రా చ వే మ న

నాల్గువర్షంబు లేలెను - నాల్గు చెఱఁగు
లెట్టిపాలన సల్పెనో - యెఱుకపడదు
రాచవేమన కొండవీ - ట్రాజ్యమందు
భూరి సంతాన సాగరం - బునకు కాల్వ
యొందు నిర్మించి విఖ్యాతి - నొందె నతఁడు,

౨

రాచకొండ నృపాలురు - రణము నందు
దేవతా ఖడ్గ మొకదాని - దెచ్చి యుండ
వైరి లింగయ కేమని - పలుకు మనెనొ
నందిపోత కఠారి శ్రీ - నాథ సుకవి
బంపి తెప్పించు టొక కార్య - భరము బూనె,

3

ప్రజలకీ వేమవర్యుని - పాలనంబు
నచ్చలేదంద్రు పన్నులు - హెచ్చుకతన
నా యసంతృప్తిగల యట్టి - యల్పుఁ డొకఁడు
బలిజపౌరము యెల్లన - తుఱవబుద్ధి
వెనుకగాఁ బొంచి యీ విభుం - దునిమెనంట.

ఆరాధ వేమ నార్యుని
గాతాపుందమ్ముఁ - జంద్రుగా వేమకవిన్
ధారుణి యోగీశ్వరుఁడయి
కారణజన్మ కవి యనగ - ఖ్యాతివహించెఁ.

౫

పదునేడు శతాబ్దంబున
దుది నితఁ డుండెనని - పండితులు కొందఱు బ
ల్కెడ రీతని పద్యంబులఁ
జదివి విమర్శించి వారి - చాతుర్యమునఁ.

౬

తన సుధామధురోక్తులఁ - దన్పఁ బ్రజలఁ
గన్పడిన రాళ్ళపైనెల్లఁ - గవిత వ్రాసి
శిలలఁ జెక్కించి గీతాల - నిలిపె నంద్రు
వేమసుకవీం[illegible]తని - విమతి సేతుఁ
బరసవేదిని గాంచిన - పరమయోగి.

౭

పూజ్యమౌ కొండవీటి సా - మ్రాజ్యమెల్లఁ
గైవశంబయె మెల్లన - దేవరాయ
నరపతికి రెడ్డి రాజ్య - వినాశనంబు
కాలవశమున గల్గుట - గానుపించు.

౮

కాకతీ యాంధ్రరాజ్యంబు - కలిమిదగ్గి
రడ్డి రాజ్యంబు శతవత్స - రములు చెల్లె
గాలచక్ర పరిభ్రమ - రాల దెలియ
గాలమును దాట నేరికి - గాదుగాని.

దేవ, బ్రాహ్మణ, విద్యా వి - దేశవణిజ
సంపదలనెల్లఁ గాపాడి - పెంపుజేసి
కీర్తిఁ గొన్నారలీరెడ్డి - నృపతులెల్ల
నాంధ్రలోకంబు హర్షింప - ననవరతము.

౧౦

ముష్కర తురుష్క పాలన - మునకు రోసి
యాంధ్రదేశంబునకు గొప్ప - యానకట్ట
గాఁగనీరెడ్డి రాజ్యంబు. - గ్రాలుచుండ
తురకవాహిని రాకుండఁ - దొలఁగెనపుడు

౧౧

కొండవీటిదుర్గ కోటలు పేటలు
పాడుపడిన విపుడు - జూడఁగఁ దము
అచటగానఁబడెడి - యఖిలవస్తువులందు
పూర్వవైభవముల - పొలుపు దెలియు.

—:O:—

## రాజమహేంద్ర రెడ్డి పాలకులు

పదియునాల్గు శతాబ్దంపు - ప్రాభవమున
నాంధ్ర హిందూ సురత్రాణుఁ - డైన పిదప
గావనృపతి గోదావరీ ఖండమునకు
తనదుతోబుట్టు నల్లుని - దర్పశాలి
మంచికొండ కూనారెడ్డి - నెంచియెంచి
కోరుకొండ నేలుమటంచు - గూర్మినించె.

కోరుకొండకు బోయి యా - కూనరెడ్డి
దుర్గమొక్కటి నిర్మించి - తురకభయము
నడచి పాలించెనంతట - నతని సుతుఁడు
ముమ్మడీంద్రుఁడు రాజయి - ముదముఁ గొలిపె.

ముమ్మడి నాయకుఁడు :

౩

అంగరసీమయు - శాంగలు నాట్సీమ కురవాటిసీమయు - గోనసీమ
కొత్తాముసీమయు - గోదావరీనదీ సారభూఖండాల - జనులనేగ
బూనియు నిజరాజ - ధాని కోర్కొండను నిలిపి, శత్రులనెల్ల - నులిమివైచి
లక్ష్మీనృసింహాలయము కోర్కొండను - గట్టించి రెండూళ్ళు - గాన్కనిచ్చి
ముప్పదేడులు రాజ్యంబు - మోదమునను
జేసి సత్కీర్తి వార్జించె - చెలువు మెరయ
మంచికొండకూనారెడ్డి - మాన్యసుతుఁడు
ముమ్మడీంద్రుఁడా ప్రభువర్యుఁ - బొగడ దరమె,

౪

జ్ఞాతివైరంబు బూనక - నీతిదమ్మఁ
సింగనృపతిని గన్నయకా - చేతిక్రింద
నుంచి పరిపాలనం బిచ్చి - కాంచెఁ గీర్తిఁ
భ్రాతృప్రేమంబు జూపిన - రాజసింగ,

౫

వీదికాలమునకు - చోరులు హెచ్చైన
వెల్మ వీరవరుల - భీమపురిని
గాప సార్వభౌము - గదిసి దోర్బలమున
హతముజేసి రంత - నాహవమున,

వైష్ణవ మతాను రక్తిసీ - ప్రభుఁడుశిష్యుఁ
డై పరాశరభట్టను - యార్యునకును
దనదు రాజ్యము నందామ - తంబు వృద్ధి
గాఁగఁ జేసెను సత్కీర్తి - కాముఁడగుచు.

౭

పంచ పాండవులను రీతి - గాంచె నితఁడు
పుత్రపంచకమును జనుల్ - బొగడుచుండ
నగ్రజుఁడు కూనరెడ్డియు - నన్నరెడ్డి
వరుసఁగాటమరెడ్డియుఁ - ధరణిపతులు.
నతని తర్వాత పాలించి - ఖ్యాతి గనిరి.
కూనరెడ్డి సుతుండంత - గోరుకొండ
నేలె ముమ్మడిరెడ్డియు - నేర్పుమీద.

౮

దేవతాసౌధ నిర్మాణ - దీక్షఁబూని
వాని బోషింప భూముల - దానమిచ్చి
తండ్రిఁబోలిన తనయులు - దారలనెడి
యశము నార్జించి నారలీ-యవనిపతులు.

౯

వీరి వాడపిదప - నేరికిదెలియగా
దొక్క వేళనందె - సుక్కినారొ
యైన గొండవీటి - యధిపతి యనవోత
విభుని పాలనంబు - వెలిఁగె నిచట.

౧౦

ఆతని పాలనమున - కద్దుదగిలి భక్తి
రాజు మొదలుగాఁగ - ద్రిభువతంసు

లాక్రమించినంత - నా రాజ్యభాగంబు
విడచిపెట్టి కొండ - వీటినేలె.

౧౧

కొండవీటి రాజ్య - కు నలయపతియన
వేమ నృపతి మరల - వీఁక వెదలి
కోరుకొండలోని - కోటలం గూలిచి
సీమ లేకముగను - జేర్చి యేలె.

౧౨

అతని పిమ్మట కొమరగి - ర్యాఖ్యనృపతి
కైవశంబయె రాజ్యంబు - క్రమముగాను
కాటరెడ్డి వేమారెడ్డి - ఖ్యాతిఁబడసి
యాప్తబంధువై - పాలన మంత జరుప.

౧౩

**కాటయ వేమా రెడ్డి :**

కొమరగిరి వరవర్యుని - కూర్మి బల్మి
రాజ్మహేంద్ర రాజ్యంబున - బ్రతిభ వడసి
వీరవర్యుఁడు కాటయ - వేమనృపుఁడు
పాలనమొనర్చె నచ్చటి - ప్రజలు మెచ్చ.

౧౪

కొమరగిరికి సామంతుఁడై - కొన్ని యేఁడ్లు
కొన్నియేండ్లు స్వతంత్రుఁడై - కోర్కెమీర
దీక్ష ముప్పదివత్సరాల్ - తెరిపిలేక
యేలినాడెల్ల నృపతుల - నే పడంచి.

౧౫

సీ॥ వింధ్యాద్రిమొదలుగా - వివిధప్రదేశముల్, సింహాద్రివరకును-జేర్చియేలె
పాలకొలను సర్వ - వరము ద్రాక్షారామ, దేవాలయంబుల - దీక్షఁగనియె

వీరుఁడై కోమటి - పెదవేమభూపాలు, రణమున నెదిరించి - రాజ్యమేలె
సంస్కృత విద్యావి - శారదుఁడై కాశి, దానకృతములకు - వ్రాసెవ్యాఖ్య
గణపతులతోడ వైరంబు - కతన నెన్నొ
కదనముల్ గల్గినను లెక్క - గనక పోరె
నౌర యల్లాడరెడ్డి సా - య పడనేలెఁ
విపుల రాజ్యంబు కాఁడయ - వేమనృపతి.

౧౬

రాజమహేంద్రమున మార్కండేశ్వరులను బ్ర, తిష్ఠింపఁగాఁజేసె - దేవిచేత
గోపవరంబును - గోపినాథస్వామి, కల్పించి భక్తిచే - ఖ్యాతి నొందె
నౌబలారాధ్యుల - కగ్రహారములిచ్చి, బ్రాహ్మణోత్తములందుఁ - భక్తిఁజూపె
మల్లవరంబను - మహితాగ్రహారంబు, నరసింహపండితు - నకు నొసంగె
ఫిరోజిషా వెల్మవీరుల - వీఁక తోడ
సాయపడనన్నె చోడుని - సంగరమున
గుండుగొలను ప్రాంతమ్మున - గూలె నకట
కడకు గజరావుతిప్పని - ఘాత బలిమి.

౧౭

కాలగతిదప్ప నెవరికిం - గాదు గాన
నపుడె కాలుఁడు వేముని - యాప్తసైన్య
దశసహస్రంబు భీతిల్లి - తారసిల్లఁ
గాలకము నన్న దేవుని - శరణుజొచ్చె.

౧౮

ఎంతకాలము జరగెనో - యిట్లు మరల
రేగి దొడ్డయ యల్లాడ - రెడ్డి నృపతి
యన్న దేవుజయించి రా - జ్యాధిపతిగఁ
గొమరగిరి నాముఁబ్రభుపుత్రుఁ - గూర్మి నిలిపె.

అతఁడు గొన్నినెలలె - యవని బాలించి స
ద్గతికి జేరినంత - నతని యనుజ
యమల గుణగుణాంబు - ధుని తల్లి కైవశ
మయ్యె రాజ్యలక్ష్మి - నెయ్య మొప్ప,

## అల్లాడరెడ్డి

అల్లాడరెడ్డి భూపుం
డల్లన నామె ప్రతినిధిగ - నవనీశుండై
చెల్లించి తనదు దర్పం
బెల్లెడలఁ బదేండ్లు - రాజ్యమేలెన్ వీఁకన్,

౨౧

జనవిభుని పుత్రులందున
వని తల్లికి నీడుజోడు - నా నొప్పుయశో
ధనమూర్తి వీరభద్రుం
డని తల్లిం బెండ్లియాడి - యధిపతి యయ్యెన్.

## వీరభద్రారెడ్డి

చిల్కానరసుదాక - జెండాడి శత్రు వీరులను, జయస్తంభములను నిలిపె
లానుదేవుఁ జయించి - ప్రబలాధిపీతుఁడై పాలుపారఁ గళింగ - భూమినేలె
తెలుఁగుబాసకువన్నెదెచ్చిన శ్రీనాథ, కవిచేతఁ గృతినొందెఁ - గావ్యములను
కఁచి, పంచారామ-కాశి శ్రీగిరులందు, స్వాములసేవించి - భూమలోనఁగె

గీ. పరహితాచార్య వైద్యుని - పటిమఁగాంచి
కలువచేరను గ్రామంబుఁ - గాన్కనిచ్చె
పట్టమహిషియౌయని తల్లి - వాక్కు నిలిపి
వీరభద్రాన్నృపుండు వి - వేకశాలి,

జ్యేష్ఠసోదరుఁడగు వేమ - నృపతి తనకు
దోడునీడయి రక్షింప - దొడ్డభూవుఁ
డన్నరెడ్డియు ననుజాతు - వన్నెదేఁగ
రాజ్యమేలెను వీరభద్రా - నృపుండు.

౨౫

ఈ నృపాలుని సామంతుఁ - డెన్నఁ దగిన
వాసిరెడ్డి కులీంద్రుఁడై - వరలు వాఁడు
పోతవిభుఁడెన్నొ దేవళాల్ - ఖ్యాతి నిల్పె
బీతికాపురమందున - విమల భక్తి.

౨౬

తాళ వృక్షంబు లచ్చట - దక్కువైన
నాల్గులక్షల దెప్పించి - నాటె నితఁడు
కమ్మవంశమునందున - ఘనయశుండు
మన్నె దేవేంద్రుఁడని జను - లెన్నుచుండ.

౨౭

ప్రజల సౌఖ్యశ్రీకిటు - పాటుబడుచునుండ
వెలమ విభుఁడగు లింగయ - వీరవరుఁడు
రణమొనర్పఁగ దన బలా - క్రమముఁజూపి
వీరస్వర్గంబు నొందెనా - వీర నృపతి.

౨౮

ఆంధ్రజనులకు సంతాప - మతిశయిల్ల
రాజమహేంద్రపురంబున - రెడ్డిరాజ్య
మస్తమించెను వీరభద్రానృపుండు
ప్రాణముల నాహవంబున - బాసినంత.

రెడ్డి, వెల్మ నృపాలుర - రడ్డికంబె
యాంధ్రభూమిని స్థిరమయి - యలర కున్నె
యొండొరులకును వైరంబు - లుద్భవిల్లి
యతిశయిల్లి వారల పుట - మార్చుకున్న.

## మరికొందఱు రెడ్డియోధాగ్రేసరులు

### (నక్షత్రమాలికలు)

సీ. తాళ్లూరికానవనోద్దండుఁడయ్యెను మార । సానికేతయరెడ్డి - జనసుతుండు
జల్లిపల్లిని వీరస్వర్గంబునొందిన । గోలిమల్లారెడ్డి - కోవిదుండు
శౌర్యసాహసుఁడయ్యె జల్లిపల్లిని రావు । పురుషు మల్లారెడ్డి - పుణ్యమూర్తి
యుద్ధరంగమునందు నుద్దండుడగువిని । కొండమారారెడ్డి - దండినృపతి
వీరాధివీరుఁడై - పోరులుసల్పె తుం । బ్లూరిమారారెడ్డి - శూరవరుఁడు
వెలమలతో నాజి-విహరించెమలచయు । కొండమాచారెడ్డి - దండినృపుఁడు
సప్తమాడియములు - సమతబాలించెను । చెర్ల భీమారెడ్డి - చేవకాఁడు
జలిపల్లిక్షేత్రాన - చలముజూపించెపో । లూరి పోలారెడ్డి - వీరవరుఁడు
అనుమనుగల్లున - ఘనులైన చేయూరి । పోలిరెడ్వంశజుల్ - పుణ్యవరులు
జల్లిపల్లిని మేటిసమరాన బోరెను । నౌరగిర్నారయ - నామరెడ్డి
గణపవరంబున - గణుతికెక్కినవాఁడు । కోనకోటారెడ్డి - మానధనుఁడు
అనపోత మాదన - లను వైరులనెదిర్చి । బండికోటారెడ్డి - పటిమఁజూపె
రణరంగమునబోరి - రాజిల్లెనా మంగి । పూడి యిమ్మడిరెడ్డి - పురుషవరుఁడు
అతిసాహసంబున - నాజిఁబోరిన క్రొత్త । కొండకొండ్రెడ్డియి - కులమువాఁడె
హంపిలోబేరొంది - యధికారములనల్పె । పొంఢపొందజగదాళ పోలిరెడ్డి
రాజమహేంద్రాన - రాణించె నచ్యుత । నరపాలు సామంత - నాగిరెడ్డి

కామినేన్వంశజుల్ - కామమల్లారెడ్లు । బిక్కవోలున నేలి - పేరుగనిరి
రంగనాథునిపేర - రామాయణముఁ వ్రాసె । హూనికతో గోన - బుద్ధరాజు
గార్లప్రాంతంబునగణుతిగాంచినవాఁడు। రేచెర్లబొప్పయ-నృపతివరుఁడు
మారయసాహిణి శ్రీ - రామభక్తుఁడై । భాస్కరకవి కృతి - భర్తయయ్యె
సర్పవరంబున స్వామిని-సేవించి । గోలిసోమారెడ్డి నేల - నొసఁగె

గీ. ఎందఱెందఱో భువిబాసి - యేగినారు
వారినందరి దెలియఁగా - వశమె మనకు
కీర్తికాయులు వారి సం - కీర్తనంబె
యభ్యుదయకారియై యొప్పు - నయ్య మనకు.

సీ. సర్పవరంబున - స్వామికి వనమిచ్చెఁ । బూరికై చర్ల - కయ్యాలరెడ్డి
కోటిరెడ్డిమహీశు - కొడుకు పెద్దారెడ్డి । బృందావనము వేసి - పేరుఁ జెందె
రామేశ్వరునికిచ్చి - భూమిని పలెవాడ । తమ్మలిచోడయ - దాతయయ్యె
మాన్యుఁడై భూదాన - మహిమచే విలసిల్లె। ప్రియపుత్రుఁడితనికి పెద్దిరెడ్డి
రాజశాసనికుఁడై - రాజిల్లె మధురాంత । సూరపరెడ్డివి - శుద్ధగుణుఁడు
పాలకొల్లునస్వామి-భజియించిసేవించె। మధురాంతకులజుఁడౌ-మదిరిరెడ్డి
గణపవరంబున - గట్టెదేవళమొండు। భోగాది సుబ్బన్న - భూరియశుఁడు
రామేశ్వరునినిల్పె-రహిముప్పవరమున। మహిమంతవంశ్యుఁడౌ-మల్లరెడ్డి
కాకతిరుద్రుని - గట్టిసామంతుఁడై । పొల్వారె నాగయ - బొల్లిరెడ్డి
యాటూరురామన్న-పేటలో గుడికట్టె। మాన్యుండు సామంత - మల్లిరెడ్డి
కలపదానమొసంగి-ఖ్యాతిగాంచెనుదోస। పాటిరుద్రయదేవ-భవనమునకు
కాంచీపురపురాజ్య - గర్వంబడంచెను । రేచెర్ల బమ్మయ-రెడ్డివరుఁడు
మంధన్యగుండయన్-మర్దించిపేరొందె। కాటయకాముండు-ఘనయశుండు
దొంతివంశీకులు - దోర్బలయశులైరి । వీరప్రతాప పృ - థ్వీపతియంద
గణుతికెక్కినవాఁడు - గణపతిదేవని । సామంతరేచెర్ల - నామిరెడ్డి
కాటయమల్లయ - కామయరెడ్డులు । సైన్యాధికారులై - మాన్యులైరి

కరణనాటివి బేరు - గాంచిన ధీరుఁడా । కాలాన ముంజేటి - గంగిరెడ్డి
గణపతిదేవుని - కాళింగయాత్రబే । యుంగాంచె రేచెర్ల - రుద్రరెడ్డి
వీరప్రతాపుతో - బోరు ముస్లిములపైఁ । బౌరుషంబునుజూపె - బసివిరెడ్డి
చాగిదోరయరాజు-సామంతుఁడై గంధ। సిరివంశసూరప-వరుఁడు నెగడె
వీరభద్రేశుని - వెలయించిమించెను । ఖ్యాతిచే మతసావి - కాటరెడ్డి
సర్వసైన్యాధ్యక్ష-నిర్వాహయశమందె । రేచెర్ల గణపతి - రెడ్డికులుఁడు
వీరభద్రారెడ్డినృపతి - రాణిగనుండి । యనితల్లిత్యాగియై - యశముగాంచె
అల్లాడవేమస్య - పాలునిపత్నియై । జియ్యసానమ్మ రం - జిల్లె జగతి
రావూఢనేలిన - రాఘవరెడ్డియు । గవులబోషించి వి - ఖ్యాతి గనియె
ముష్టిపల్లీవంశ - భూపుండు సోమయ । గద్వాలరాజుగా - గణనకెక్కె
వనపర్తి,యాత్మకూ-ర్మునగాలసంస్థాన। పాలకులీ రెడ్డి - వంశ్యులుగద

గీ దానశూరు యోధులు - ధరణి నృపులు
యెందరెందరో నుండి రీ - చందమునను
దేశహిత భక్తియుక్తులై - ధీరులగుచు
వారినందఱి దెలియంగ - వశమె మనకు
వారి సత్కార్యదీక్షయే - వలయుగావి.

—:o:—

## —• సవరణలు •—

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 6 | పద్యకొల్వ | పద్య |
| 4 | 2 | పింగ | సింగనా |
| | 13 | విలిపె | విలిపె |
| 5 | 14 | మనెను | మనెనా |
| 6 | 21 | రాల | జాల |
| 7 | 14 | నల్లుని | వియ్యంకు |
| 20 | 15 | వరుఁడు | వర్యుఁడు |
| 22 | 10 | బదేండ్లు | బదేండ్లు |
| 23 | 15 | విభువగు | విభుఁడగు |